సంపుటము 2]  సెప్టెంబరు 1915  [సంచిక 3

# బాలమిత్ర



## తెల్లని జండాపైని ఎర్రని సిలువ

ప్రియ బాలమిత్రులారా!

మీరందరు జండాలను చూచితిరిగదా. ఎర్రని సిలువ వేయబడిన తెల్లనిజండాను, మీలో నెంతమంది చూచితిరి. ఈ జండా దేనిని చూపించుచున్నది; పూర్వము ఇంగ్లాండు దేశమున ఒక భూతసర్పము గలదు. దీనిని ఒక గొప్ప ఆంగ్లేయుడగు, పరిశుద్ధుడైన జార్జి అను ఆయన చంపి

దానివలన సంభవించుచున్న, గొప్పగొప్ప కీడులనుండి ఆ దేశపు ప్రజల రక్షించెను. ఈ వీరకృత్యమును సూచించుటకే ఈ జండా ఏర్పడినది. ఇంగ్లీషునాణెముల త్రిప్పిచూచితివేని జార్జిదొరగారు ఎట్లు ఆ భయంకర సర్పమును తుదముట్టించెనో తెల్పు బొమ్మను చూతువు.

మరియు డాక్టరులు, వైద్యసంబంధపు నర్సులు మొదలైన వారు ఎర్రని సిలువగల తెల్లనిజండాను ఎప్పుడు ధరింతురు. ఎందులకో మీకు కారణము తెలియునా? వారు కలరా, మశూచకము, క్షయ, విషజ్వరములు మొదలగు అనేక భూతసర్పములను చంపుచున్నారు గనుకనే ఈ జండాను ధరించుచున్నారు.

బాలమిత్రులారా! మీరంతా ఈ జండాను ధరించి తీరవలెను. ఈ జండాను ధరించకుంటివేని మీరు భూతసర్పముల చంపజాలరు. మేము చంపవలసిన భూతసర్పము లేమియున్నవి? అని అనుకొనుచున్నావా? అవును అనేకములున్నవి. మనయందున్న చెడుగుణములైన అసూయ, కోపము, గర్వము, పగసాధించు కక్షలు మొదలగునవి భూత సర్పములు కావా? వీటిని అనగా ఈ ఘోరసర్పములను ఎర్రని సిలువాకారముగల తెల్లని జండాను ధరించకుండా చంపలేరు.

తెల్లనిజండా అనగా నేమిటి? అది పరిశుభ్రమైన మీ

హృదయము లేక మనస్సు. మీలో నెంతమంది హృదయములు చెడ్డగుణములతో నింపబడి నల్లగాను, పసుపుగాను, పచ్చగాను ఉండుటలేదు. మీ శుభ్రమైన తెల్లని హృదయములలో ఎర్రని సిలువాకారము ఉండవలెను. ప్రేమ "ఎర్రని సిలువ" ను సూచించుచున్నది. రక్తవర్ణముగల ఎర్రని సిలువయేగాని మరి ఏవర్ణముగల సిలువయు ప్రేమను సూచింపదు. తెల్లని జండాయగు మీ శుభ్రహృదయమునందు ఎర్రని సిలువయగు ప్రేమయున్న, అప్పుడే మీరందరు చెడుగుణములగు భూత సర్పముల చంపివేయుదురు. పిశాచి మిమ్మును సమీపించుచు, మీరు ధరించియున్న ఎర్రని సిలువగల తెల్లని జండానుచూచి వెనుకకు పారిపోవును. ఈ జండాను ధరించకున్న పిశాచికే లోబడిపోదురు. గనుక బాలమిత్రా! సదా ఈ జండాను ధరించి సాతానుయొక్క శోధన లెల్లను జయించి, నీ పిన్ననాటనుండియే నీ సృష్టికర్తయందు భక్తి గలిగియుండుము.

---

## జిరాఫీ

జిరాఫీ యనునది ఆఫ్రికా ఖండమునందలి ఒక జంతువు. అది పిల్లలను కని పాలిచ్చుజాతిలోనిది. చూచుటకు సొగసుగా ఉండును. దాని శరీరము కొంచెము ఎలుపు కలిసిన

నారింజరంగుగా నుండును. దాని శరీరముమీఁద నల్లని మచ్చ లుండును.



జిరాఫీ జంతువులన్నిటిలో మిగుల ఎత్తైనది. బాగా ఎదిగిన జంతువు సుమారు మూఁడునిలువుల యెత్తుండును. దాని మెడ మిక్కిలి పొడుగుగా నుండును. ముందరికాళ్లు వెనుక కాళ్లకంటె పొడుగుగానున్నట్లు కనఁబడును. కాళ్ల చివర చీలిన గిట్టలుండును.

జరాఫీ చేలమీదనున్న మేతఁ దినుటకు ముందరికాళ్లు రెండును చాల దూరముగ పెట్టి క్రిందికి వంగి తినవలయును. ఇట్లుతినుట మిగుల కష్టముగ నుండును గనుక అది సాధారణముగా ఎత్తయిన చెట్లకొనలు తుంచుకొని తినుచుండును. దాని నాలుక చాల పొడుగుగ ఉండును గనుక ఆకులు లేఁత కొమ్మలు మొదలగువానిని చుట్టచుట్టి నోటిలో దోపుకొనుచుండును.

జిరాఫీ కన్నులు తల త్రిప్పకుండ నాలుగు వైపులను చూచుటకు వీలగునట్లు అమర్పఁబడి యున్నవి. కన్నులు పెద్దవి. చాల దూరము చూడఁగలవు.

జిరాఫీకి రెండు చెవుల మధ్యగా రెండు కొమ్ములు కలవు. అవి పొట్టివి. చర్మముతో కప్పఁబడియుండును. శత్రువుల నుండి తప్పించుకొనుటకది కొమ్ములను విశేషముగా వాడుక చేయదు. ముందరికాళ్లతో త్రొక్కి చంపును.

జిరాఫీకి మెడమీఁద పొట్టి జూలు కలదు. జిరాఫీ మాంసమును తిందురు. చర్మముకూడ చాలవెలకు అమ్ముడు పోవును. అందుచేత జిరాఫీలను వేఁటాడుదురు.

జిరాఫీ నడక అంద వికారముగ ఉండును. కాని, దాని పరుగు మంచి వేగముగల గుఱ్ఱములు తప్ప కలిసికొనలేవు.

జిరాఫీకి పసిపట్టు శక్తి చాల కలదు. దాని తోఁక ఆవు తోఁకవలె చివర కుచ్చు కలిగియుండును.

జిరాఫీ తడవ కొక్క పిల్లను యీనును. పిల్ల పుట్టిన మూఁడు దినములకే తల్లివెంట వేగముగా బరుగెత్త గలిగియుండును. జిరాఫీ పిల్లలు త్వరలో మచ్చికపడును గాని సాధారణముగ దిగులుపడి మేతతినక నీళ్లు త్రాగక చనిపోవును.

జిరాఫీ చాల పిరికిజంతువు. నిరపాయకరమైనది. శత్రువులనుండి తప్పించుకొనుటకు తన్నుటతప్ప మఱొక సాధనములేనిది. ఇతర జంతువులను చంపితినక గడ్డితోను ఆకులతోను కడుపునింపుకొని ఎడారులలో కాలము గడుపునది. తన ప్రాణములు కోలుపోయి మనుష్యులకు రుచికరమగు ఆహార మగునది. చర్మము మూలమున అనేకపనుల కుపయోగపడునది; బ్రదికియుండగాఁ జూచుట కందమైనది. అట్టి జంతువును చూచుట మీకు యిష్టముకదా! కాని జంతువులు మన దేశములో బ్రదుకవు. గనుక యిప్పటికి మీరు ఆ జంతువును పటములోమాత్రము చూచి సంతోషింపుఁడు. ఈ పేజీమీఁద గలబొమ్మ యేమో మీకుఁ దెలియునా? అదియే సుఁడీ జిరాఫీ!

---

# సజ్జన హితులారా అనే వరుసను పాడ తగినది

బూతులు నేర్వకు - భువిలో నెప్పుడు - బొంకకు మీధరన్ -
బాల ప్రాయమునుండి ‖ బూతులు ‖

1. దొంగిలబోకుము - భంగమువచ్చును - అంగములన్నియు -
కృంగియుపోవును ‖ బూతులు ‖

2. కొండెముల్ సెప్పకు - గండముల్ వచ్చును - దండిగ
ద్వేషము - నిండును నీపై ‖ బూతులు ‖

3. మర్యాద చేయుము - మాతాపితలన్ - మాటలన్ వినుమా-
మీరక యెప్పుడు ‖ బూతులు ‖

4. పాటలు పాడుము - ప్రార్థనల్ చేయుము - పరికించి
చూడుము - పరమాత్ము నెపుడు ‖ బూతులు ‖

---

# విధేయతగల బాలుడు

పొగబండి మార్గములందు మార్గదర్శులు అను పని
వాండ్రు కొందరు ఉందురు. వారు యినుపపట్టాలను
యథోచితముగా పొగబండ్లు వచ్చుటకుగాను మార్చుచుం



దురు. కాఁబట్టి ఆ బండ్లు తాము పోఁవలసిన పట్టాలపై పోఁవును. ప్రష్యాదేశమున నొకఁడు ఇట్టి పనికి కుదిరి తన తాఁవున నిలుచుండి తన పనిని చేయు బూఁనుకొని యుండఁగా రెండు ప్రక్కలనుండి రెండు బండ్లు వచ్చుచుండెను.

అట్టి సమయమున పొఁగయంత్రము వచ్చుచున్న దారికి కట్టెదురుగా వాని చిన్నకొఁడుకు ఆడుకొనుచుండెను. వాఁడప్పు డేమిచేయఁగలడు? వాఁడు తన కొఁడుకును బ్రతికించు

కొనుట దుర్లభము కాదుగాని తన కొడుకును కాపాడు కోవడమును పొగబండ్లను సరియైన పట్టాలపై నడుపుటకై తాను చేయవలసిన పనియును ఈ రెండు పనులను ఏకకాలమందు చేయుట వానికి సాధ్యముకాదు. తన కుమారుని కాపాడుటకై వాడు పరుగెత్తుకొని పోయినయెడల బండ్లలో నుండిన జనుల నేకులు నశించిపోవలసి వచ్చును.

వాడు తన కుమారుని యవస్థనుజూచి ఊరక ఉండలేక చాపచుట్టవలె నేలమీద పరుండుమని తన కుమారునికి కేక వేసి తాను పోయి బండ్లను సరియైన మార్గమున నడిపించెను. తండ్రి చెప్పినట్లు చేయడమను పసివానికి అలవాటై యుండెను, గాన, వాడు తన తండ్రి చెప్పినట్లే పండుకొని యుండెను. అప్పుడు వానిపై నుండి బండ్లన్నియు గుబగుబ ధ్వని చేయుచు సాగిపోయెను. తన కుమారుడు చచ్చిపోయి యుండెనని తలచి ఆ పనివాడు గుండెలు కొట్టుకొనుచు ఆ పిల్లవాడు పరుండియుండిన చోటికి పరుగెత్తుకొనిపోయెను. వాని యదృష్టమువల్ల ఆ పిల్లవాడు బ్రతికియుండెను. వాని కెంతమాత్రమును హాని కలుగలేదు. అంతట పిల్లవాడు నాయనా, నేను లేవవచ్చునా, అని తండ్రి నడిగెను.

ఈ కథలో ఆ చిన్నవాడు తెలియక అట్టి అపాయకరమగు స్థలమందు ఆడుకొనుచుండుట వాని తండ్రి చూచి

యుండి ఏదో యొక మాట తన కుమారునికి చెప్పేవరకు వాని మనస్సు అల్లకల్లోలముగ నుండెను. వ్యర్థముగా కుమారుడు చనిపోవును. ఇంత గారాబముగా నేను పెంచిన ఈ పుత్రుని ఒక నిమిషములో మృత్యువునోట కప్పగించుచున్నాను, నేను యిట్టి దురవస్థను చూచి యూరకుండలేను. అని తలచి కుమారునిపై ప్రేమచే ఒకమాట చెప్పెను. అది ఏమనిన చాపచుట్టవలె క్రింద పరుండుమని కుమారుడు తండ్రి చెప్పినమాట చెవినిబడిన తోడనే జాగుసేయక తండ్రి యాజ్ఞకు బద్ధుడయ్యెను. ఎందుకు నే నాలాగు చేయవలెను? ఆలాగు చేసిన బ్రదుకగలనా? ఆలాగు పరున్న ముందుకు నాకేమి వచ్చునో, అను సందేహములు ఆ పిల్లవానికి పుట్టలేదు. తండ్రి చెప్పిన ప్రకారము చేసినందుననే ఆ కుర్రవాడు మరణమునుండి తప్పించబడెను.

ఈ కుర్రవానివలెనే మీరును నేనును అనేక పర్యాయములు తెలియని రీతిగా అట్టి అపాయకరమగు స్థలమునొద్దకు వెళ్లుచున్నాము. అది యేదన (నరకము) అచ్చట మన ప్రేమగల తండ్రి మన దురవస్థను చూచి సహించలేక తనకు మనయందు గల ప్రేమచే ఓ నా కుమారీ లేక నా కుమారుడా నా యొద్దకి రమ్ము. నీవు రక్షింపబడెదవని చెప్పుచున్నాడు.

---

# ప్రకృతి పాఠములు

## 14-వ పాఠము

## ఆకుల ప్రయోజనము

ఇదివరకు మనము ఆకులనుగూర్చి కొన్ని సంగతులను నేర్చుకొనియుంటిమి. ఈ పాఠమునందు వాటివలన కలుగుచున్న ఉపయోగము లెట్టివో కనుగొందము.

గత మాసములో ఆకులు గాలిలోకి విశేషముగా నీటిని ఆవిరి రూపముతో పంపుచున్నట్లు చూచితిమి. ఎండాకాలములో గాలి ఎట్లుండునో మీకందరకు తెలియునుగదా! ఆకులలోనుండి ఆలాగు ఆవిరి పోనియెడల చెట్లక్రిందనుండు నీడవలన మనకంతగా లాభముండదు. సూర్యుని తీక్ష్ణమగు కిరణములు మనకు తగలవనుటయే గాని, చల్లదనము కొంచెమైననుండదు. మిట్ట మధ్యాహ్నము, నడినెత్తి మాడుచు, కాళ్లు క్రింద పెట్టనీయకుండునప్పుడు వేపచెట్టు క్రిందకు పోయి కొంచెముసేపు అలసట దీర్చుకొని "హాయి హాయి" యని చెప్పనివారెవ్వరు? ఎందుకు అచ్చట అంత చల్లగానుండవలెను? ఆకుల నోళ్లగుండా ప్రతిక్షణమును చెట్టు వ్రేళ్లద్వారా వచ్చుచున్న నీరు ఆవిరిరూపముగా బయటికి వచ్చి గాలిలో ప్రవేశించును గనుక చెట్టుక్రిందనున్న గాలి చల్లగానుండి సేద

దీయును. ఇట్టి నీడ మనకుమాత్రమేగాక ఆ చెట్లు సంధ్లకును గాపలెను.

ఆకులు కంటికింపుగా నుండును. వాటి రంగు కంటికి హాని కలిగించదు. తక్కిన రంగులు చూచినయెడల అప్పుడప్పుడు కంటికిష్టముగా నుండవు. కండ్లు కొంచెము జబ్బుచేసినవారి రంగును తప్ప మరేదానిని చూడజాలరు. ఇప్పుడు మీరు మీ కండ్లెత్తి మైదానములవంక జూడుడి. అవి మొన్న మొన్న పడిన వానకు గడ్డిపట్టి, పచ్చగానుండి ఎంత రమ్యముగా నున్నవో! ఎండకాలమునందు గడ్డియంతయు మాడి చూచుట కసహ్యముగానున్న నేల లిప్పుడెంత సొగసుగా నున్నవి! దానిమీదపడి పొర్లాడుటకును అప్పుడప్పుడు ఇష్టమగును.

ఆకులు చెట్లను మొక్కలను బ్రదికించి పెరుగునట్లు చేయును. ఇది వాటి ముఖ్యపనియు, ఉపయోగమునై యున్నది. చెట్లు ఆకులన్నియు తుంపివేసినయెడల అవి ఎదుగక త్వరలో ఎండిపోవును.

ఆకులు చెట్లకు ఊపిరితిత్తులవంటివి. మన మేలాగు జీవించుటకై ఊపిరిని పీల్చుచున్నామో ఆలాగే చెట్లును ఆకుల ద్వారా తమకు కావలసిన దానిని పీల్చుకొనుచున్నవి. మనము పీల్చిన గాలినే మరల మరల పీల్చినయెడల అది విషమై మనము చనిపోదుము. గాని, చెట్లు ఈ విషగాలిని తాము

పీల్చుకొని, మనము జీవించుటకు కావలసిన దానిని బయట విడుచును. ఈలాగు జంతువులును, చెట్లును బేరసారములు చేసికొనుచున్నవి.

ఆకులు జంతువుల కాహారముగా నున్నవి. ఆకులను తిని బ్రతుకు జంతువులలో మేక యొకటి. ఇది తినని ఆకు లేదని చెప్పుదురు. ఇది అన్ని చెట్ల ఆకులను తినును గనుక దీని పాలకంటె బలహీనులకు శ్రేష్ఠమైనవి లేవని కొందరు వైద్యులు చెప్పుచున్నారు.

ఈలాగు మనము ఆకులవలన కలుగు మేలు లెన్నియో చూచియున్నాము. ఇక్కడ చెప్పబడిన వానికంటె ఇంకా చాల గలవు. అనేక చెట్ల ఆకులు వైద్యమున కుపయోగించును.

---

# బైబిలు పిల్లలు

## రూబేను

యాకోబుయొక్క ప్రథమపుత్రుడు రూబేను. ఈ బాలుడు హారానులోయున్న ఇరుగుపొరుగు దుష్ట బాలురతో కలిసి పెరిగినవాడయినందున దైవభక్తిగల బాలుడు కాకపోయెను. ప్రియ బాలమిత్రులారా! చూచితిరా? స్నేహ

మాహాత్మ్యము. "సహవాస యా దుష్టగుణభవంతు సహవాస యా సద్గుణభవంతు" అను సామ్యము ఎంతయు నిజమైనది. మన స్నేహము మంచిదికాదేని మనమును మంచివారముకాము. ఒక మహనీయుడు "నీ మిత్రుల చూపుము. నీ గుణము ఎట్టిదో చెప్పెదను" అని అనెను. మన చెలిమి బహు జాగ్రత్తతో కూడినదై యుండవలెను. చెడ్డవారి చెలిమి చేసితిమేని చెడ్డగుణములే మనకు అబ్బును. గనుక ఈ చిన్న గ్రంథచదువరులారా! మీ స్నేహితు లెట్టివారో పరిశీలించుకొనుడు. చెడ్డబాలురు మీకు స్నేహితులైన, ఈ క్షణమే ఆ స్నేహమును వదలి మంచిబాలుర స్నేహము సంపాదించుకొనుడు.

రూబేనునకు పదకొండుమంది తమ్ములున్నారు. వీరిలో యాకోబునకు చివరి యిద్దరుకొడుకులపై అతిప్రేమ. పెద్దవారగు పదిమంది గొర్రెల మేపుటకై ఆయాచోట్లకు వెళ్లువారు. తండ్రియొద్ద ఇంటిలోయున్న ఇరువురు కుమారులలో పెద్దవాడగు యోసేపు అప్పుడప్పుడు సహోదరులకు తండ్రియొద్దనుండి వర్తమానములను కొనిపోయి వారి క్షేమ సమాచారములను తండ్రికి తెలుపుచుండువాడు. తండ్రికి ఈ కుమారునిపై ఎక్కువ ప్రేమయని పెద్దవారైన పదిమంది అన్నలకు అధిక అసూయ. అన్నలకు ఇంత సహాయముచేసినను ఇతనిపై

అసూయ దాల్చియుండిరి. రూబేనుకూడా అసూయగలవాడు గదా! ఆహా! ఈ అసూయ అన్నివిధముల చెరుపైనది. గనుక మనలోగల అసూయను అడుగంట తీసివేసి ఆ కాళీ స్థలమును ప్రేమతో నింపుటయే మనము చేయవలసిన పని. మనకు మేలు చేయువారియెడ కృతజ్ఞత ప్రేమ చూపవలెను.

రూబేను ధైర్యముతో న్యాయము చెప్పుటకు చేతగాని వాడు. తమ్ములు యోసేపును చంప ప్రయత్నించినపుడు అట్లు చేయుటకు ఇష్టములేనివాడై, తమ్ముని భద్రముగా తండ్రి కప్పగింపదలచి తమ్ములతో "తమ్ములారా! తమ్ముని రక్తమును చిందించకుడు. ఈ సమీపముననున్న గుంటలోనికి త్రోయుడు" అని చెప్పినవాడు. మనము మంచి యేదో ఎరిగియు, భయము వలనను, మోమాటమువలనను మంచిది చేయనియెడల గొప్ప తప్పు. రూబేను పెద్దవాడగుకొలది దుష్టుడాయెను. గనుక బాలమిత్రులారా! ఇతనిచరిత్ర మనకు గొప్ప హెచ్చరికగా జేసికొని మంచిబాలురమైయుండ ప్రయాసపడుదము.

---

# బాలమిత్ర టపా

ప్రియమైన బాలమిత్రులారా, నేను, మీలో కొందరు ప్రతినెల బాలమిత్రటపాకు వ్రాసేయుత్తరములు చదువుచుండగా, నేనుకూడా ఒక యుత్తరము వ్రాయవలెనని హెచ్చరికకలిగి ఈ చిన్నయుత్తరము వ్రాస్తున్నాను.



నేను సుమారు ఐదేండ్లప్రాయము కలిగియున్నప్పుడు నా తల్లిదండ్రులు కాలముచేసినారు. ఇప్పుడు నాకు ఇద్దరు అన్నలుమాత్రమున్నారు. పూర్వము మేమందరము ఒక హిందూ కుటుంబములోనివారము.

నాతండ్రి కాలముచేసినపిమ్మట మాతల్లి క్రైస్తవురాలైనది. ఆటుపిమ్మట కొంతకాలమునకు మా తల్లికూడా ప్రభువుయందు నిద్రించినది. అప్పుడు శ్రీ బౌడన్ మిసమ్మగారు నన్ను తమ బోర్డింగులోనికి చేర్చుకొని మిక్కిలి దయతో పోషించుచున్నారు. మా బోర్డింగులో దాదాపు నలుబదిమంది బాలికలవరకు యుందురు. బట్టలుకుట్టు, అల్లిక మొదలైనపనులుకూడా నేర్పుదురు. మన ప్రియమైన బాలమిత్రను మాకు అప్పుడప్పుడు యిచ్చుచుందురు.

ఇట్లు మీ నూతన స్నేహితురాలు

గల్లా మంగమ్మ, చెట్టిపేట

కృష్ణాజిల్లా

C. L. S. PRESS, MADRAS—1915